# విద్యాశాఖ డిమాండు

## అసెంబ్లీలో ఆమోదం

మదరాసు, మార్చి 11: మదరాసు అసెంబ్లీ యీదినం సమావేశమైనపుడు ప్రశ్నోత్తరాలు జరిగినమీదట విద్యామంత్రి శ్రీ అవినాశిలింగం చెట్టియారు విద్యాశాఖ డిమాండు ప్రతిపాదనసందర్భమున తమ ప్రసంగమును సాగిస్తూ ఉపాధ్యాయుల అభ్యున్నతికై ప్రభుత్వం చేస్తున్న ప్రయత్నములను వివరించిరి.

నిన్న సాయంత్రం పోలీసు డిమాండు ఆమోదింపబడిన పిమ్మట విద్యామంత్రి శ్రీ టి. అవినాశిలింగంగారు విద్యాశాఖకు రు 82177900 గ్రాంటు చేయవలెనని డిమాండును ప్రతిపాదించిరి. రాష్ట్రములో విద్యాభివృద్ధి కార్యాలు విశేషంగా సాగించుటకు, నిర్బంధ ప్రాథమిక విద్య, వయోజన విద్య మున్నగునవి క్రమపద్ధతిలో నిర్వహించుటకు ప్రస్తుతం చాలా తక్కువగా నుండే ఉపాధ్యాయుల జీతాలను పెంచుటకు యీ మొత్తం కావలసి యున్నదని వివరించసాగిరి. వారి ఉపన్యాసం ముగియకముందే సాయంత్రం 5 గంటలవుకు సభ వాయిదా వేయబడెను. తిరిగి నేటుదయం తమ ఉపన్యాసాన్ని సాగిస్తూ ఇలా చెప్పారు.

ఎలిమెంటరీ స్కూలు ఉపాధ్యాయుల జీతాలు ఎక్కువ యియ్యటమేగాక ఆ జీతాలు ప్రతినెల యిచ్చే ఏర్పాటు చేయబడెననిరి అసమర్థులుగా దోచేవారికి స్వస్తి చెప్పి సమర్థులకు ప్రోత్సాహమొసగుటకు ఉపాయములు చేయబడినవి. ఆర్థికముగా లాభకరముగానటువంటి స్కూళ్లను నిర్వహించేబదులు అట్టివాటిని ఎత్తివేసి మంచి స్కూళ్లను నిర్వహించుటకు ప్రయత్నములు జరుగుచున్నవనిరి. ఎలిమెంటరీ విద్యా సెకండరీ విద్యావిధానములు నూతన పరిస్థితులకు అనుగుణ్యముగా సవరించుటకు ప్రభుత్వం తలపెట్టియున్నది. ఎలిమెంటరీ పాఠశాలలు యికమీద ప్రాతిపదిక విద్యావిధాన మనుసరించి కొనసాగించవలెను. ఈ కార్యములను చక్కగా కొనసాగించుటకు జిల్లాబోర్డులకు ప్రభుత్వం సహాయమొసగు నిరి.

కళాశాలలలో వెనుక ఆయిదేళ్ల క్రితం చేర్చుకోబడ్డ విద్యార్థుల సంఖ్యలో పోల్చితే యీ సంవత్సరంలో చేరిన సంఖ్య రెట్టింపు అగును. ప్రతిజిల్లాలో కనీసం ఒక కాలేజి ఉండాలని ప్రభుత్వంవారి అభిమతం. ఆ ఉద్దేశ్యంతోనే రాబోవు వత్సరమున కడపలో ఒక కళాశాలను స్థాపించుటకు ప్రభుత్వం అనుమతి యిచ్చియున్నది.

హరిజనులకు వెనుకనుండిన సౌకర్యాలు తిరిగి యిచ్చుటకు ఏర్పాట్లు చేయబడెనవి. హరిజనులకు 10% వరకు చేర్చుకోవలసిన దనికూడా ఉత్తరువుచేయడమైనదనిరి.

వయోజన విద్యావ్యాప్తికై శాశ్వత సంస్థను ఏర్పాటుచేసి నిరక్షరాస్యతను నిర్మూలించుటకు ప్రయత్నం జరుగును.

ప్రాంతీయ భాషల అభివృద్ధికి ప్రయత్నము జరుగుననియు మిలిటరీ శిక్షణకు కూడా అవకాశమొసగబడునని రి. ఈ స్కీములన్నిటిని సభవారు సానుభూతితో ఆలోచించి నిర్మాణాత్మకమైనటువంటి ఫలితాలివ్వవలెనని కోరుతూ డిమాండును తాను ప్రతిపాదిస్తున్నాననిరి.

### కోత ప్రతిపాదన

జేకం అమరుద్దీన్‌గారు కోత తీర్మానం ప్రతిపాదిస్తూ విద్యామంత్రి ఉరుదూభాషయెడ దురభిప్రాయం కలిగియున్నారనియు ఉరుదూభాష నేర్పే విద్యాసంస్థలకు సౌకర్యాలివ్వక సవతితల్లిప్రేమ జూపుటయేగాక ముస్లింస్త్రీల కళాశాలను పూర్తిగా ఎత్తివేయుటకు కూడా సంకల్పించియున్నారు. ముస్లిం స్త్రీలకళాశాలను రద్దు చేయడంతో హోబార్టు ముస్లిం బాలికా పాఠశాలకూడా దెబ్బ తినగలదు. కావున అట్టి కార్యము చేయరాదని ఉరుదూ విద్యనుకూడా సమానదృష్టితో చూడమని తాను విద్యామంత్రికి విన్నవిస్తున్నట్లు పలికిరి.

వయోజన విద్యావ్యాప్తికై బడ్జెటులో రూ. 1½ లక్షలు ప్రత్యేకించియుండుట సంతోషమైన విషయమే అయినను అకద్దు యేమాత్రం చాలదనిరి.

శ్రీ పి వెంకటేశ్వర్లుగారు కోత ప్రతిపాదన బలపరుస్తూ విద్యాభివృద్ధికి యెంత ధనము వెచ్చించినను ఎక్కువకాదనిరి నిర్బంధ ప్రాథమిక విద్య యింకా బాగా అమలుజరగడం లేదనియు, విద్యావిధానమును పూర్తి జాతీయ మొనర్చుటకు ప్రభుత్వం పూనుకోవలెననియు కోరిరి. బెజవాడ కాలేజి ఉన్నతముగా నిర్వహింపబడుచున్నదనియు అట్టి ప్రయివేటు కాలేజీలను ప్రభుత్వమే తీసుకొని నిర్వహించవలెననిరి.

యూనివర్సిటీల గ్రాంటులుగూర్చి ప్రస్తావిస్తూ ఆంధ్ర విశ్వవిద్యాలయానికి గ్రాంటు తగినంత యివ్వడంలేదనియు, అన్నామలై విశ్వవిద్యాలయానికి ప్రతిసంవత్సరం ఎక్కువ వేయిస్తున్నారనియు ఆంధ్ర విశ్వవిద్యాలయమునెడ యిట్టి సవతితల్లి ప్రేమ చూపరాదనియు చెప్పిరి. ఉపాధ్యాయుల సంఘాలన్నిటికి రికగ్నిషను యివ్వాలని యుపాధ్యాయులు రాజకీయ సంఘాలలో చేరరాదనే ఆంక్షను తొలగించవలెననియు కోరిరి

శ్రీ కల్లూరి సుబ్బారావు తెలుగులో మాట్లాడ ప్రయత్నించగా, విద్యామంత్రిగారు తమకు ఏమీ అర్థంకావటం లేదన్నారు. శ్రీ సుబ్బారావుగారు ఇంగ్లీషులోనే మాట్లాడుతూ ప్రాథమిక విద్యను ప్రభుత్వమే నడపాలన్నారు. ప్రాతిపదిక దీక్ష (బేసిక్ ఎడ్యుకేషన్)ను అభివృద్ధి చేయటానికి ప్రభుత్వం ఇతోధికంగా ప్రయత్నించి, ప్రతి తాలూకాకు ఒక కేంద్రాన్ని స్థాపించాలి. రాయలసీమలో విద్యావ్యాప్తి చాలా వెనుకబడిఉంది. ఎంత ప్రయత్నించినా, అక్కడివారికి ఎక్కువ విద్యాలయాలు లభించటంలేదు. వయోజన విద్యావ్యాప్తికై ప్రభుత్వం తీవ్రంగా పూనుకోవాలి. కొందరు నిపుణుల సహాయం తీసికొని, వయోజనులలో విస్తృతంగా విద్యావ్యాప్తి చేయాలి. అనంతపురంలో ఆయిల్ టెక్నాలజీ విద్యాలయాన్ని పెట్టామని ప్రభుత్వం యిటున్నారు. సక్రమంగా ప్రారంభిస్తారనే ఆశిస్తున్నాము. పైగా రాయలసీమకు ఒక విశ్వవిద్యాలయం అత్యవసరం. వైద్య కళాశాలకూడా కావాలి. వీటిన్నిటిని అభివృద్ధి కార్యక్రమంక్రింద చేరాలని నాకు తెలుసు. అయినా ఒక్కొక్కదాన్ని ప్రారంభించుకుంటూవస్తే అభివృద్ధి సాగగలుగుతుంది అని సుబ్బారావు గారన్నారు.

ఇతేలో గవర్నర్‌గాలరీ పక్కనుంచి ఒకాయన, తోలు ఏదో అరవంలో చదవటం ప్రారంభించాడు. సభ్యులంతా పైకిచూశారు. పోలీసులు అతన్ని తీసుకెళ్లారు. జనాబ్ సలాం మాట్లాడుతూ, ప్రభుత్వం వారికి శిక్షపడకుల్లో విన్నపాలు చేసుకోటానికి అవకాశాలు లేక, ప్రజలు ఇలా చేయటానికి పూనుకుంటున్నారన్నారు. శ్రీ కల్లూరి సుబ్బారావు, ఎవరైనా వచ్చి స్పీకర్‌ను విన్నపం చేసుకోవచ్చుకదా అని అడిగారు స్పీకర్ అలా చేసుకోవచ్చుకాని ఆ వ్యక్తి ఏమన్నాడో తమకు వినపడలేదని చెప్పారు. శ్రీ అవినాశిలింగంగారు ఈయన కుంభకోణం మ్యూనిసిపాలిటీలో డిస్మిస్ చేయబడ్డాడని, ఆ విషయమే చెప్పుకుంటున్నాడని చెప్పారు ఇక మీరు మాట్లాడండని, సలాంగారిని స్పీకర్‌గారడిగారు.

జనాబ్ సలాం మాట్లాడుతూ విద్యామంత్రికి పిల్లలు లేకపోవటం దురదృష్టమన్నారు. (నవ్వు.)

శ్రీ కల్లూరి సుబ్బారావు: అవకాశం ఉంది. (నవ్వు.)

జనాబ్ సలాం: ఈయనకు పిల్లల అవసరం తెలియదు పైగా ప్రభుత్వం చేతిలో ఉన్న కాలేజీలకు, స్కూళ్లకు ఇబ్బంది పెట్టుతున్నారు గుంటూరు కాలేజీని రోమన్ కాతలిక్కు కొంటామన్నారు వారు చక్కటి లాభాలను కూడా చూపారు. కాని ఆ కాలేజిని, ప్రభుత్వమే తీసుకుంటామన్నారు మద్రాసులో ఉండే ప్రభుత్వ కాలేజిని ఒక వ్యక్తికి ఇచ్చారు. ఇలాంటి పిచ్చిపనులను చేస్తూ, అసెంబ్లీలో చప్పట్లుకూడా ఎందుకు? ముస్లింస్కూళ్లను తీసేయాలని—మతసంబంధమైన సంస్థ ఉండకూడదని, అవి జరిగిపోయిన స్థితుల చిహ్నాలని మంత్రిగారంటున్నారు. ప్రస్తుతవిద్య జరిగిపోయిన స్థితుల చిహ్నం కాదా? నెవకట జాతులవారు కొన్ని రక్షణలు కోరుతారు. రాయలసీమవారు రక్షణలు కోరటంలేదా? ప్రత్యేక అధికారులనుకూడా వేస్తున్నారు.

శ్రీ సంజీవరెడ్డి: వాళ్లు కోరటంలేదు

జనాబ్ సలాం: ఈ ప్రభుత్వపు విధానమే అంత ఒకసంస్థ విషయమై నేను విద్యామంత్రితో మాట్లాడి, ఇంటికి వెళ్లేసరికి, ఆసంస్థను రద్దుచేస్తూ మంత్రిగారి కాకీదు వచ్చింది. ఈసభ్యులు ఆర్భాటాలవాలని సలాం గారు తీవ్రంగా విమర్శించారు

శ్రీ వెంకటరెడ్డి గ్రామాలలో విద్యాసౌకర్యాలు చాలా హీనంగా ఉన్నాయన్నారు. గ్రామీణులకు విద్య అందుబాటులో ఉండేటట్లు విద్యా పంస్కరణలు జరగాలి విద్యావ్యాప్తి కార్యక్రమంలో ప్రభుత్వానికి సహాయం ఇవ్వటంకు కొందరు నిపుణులతో ఒక సంఘాన్ని నియమించాలి అదీకాక 10 గంటలకు స్కూళ్ళు తెరిచే పద్ధతి మానుకోవాలి. అది మనదేశ పరిస్థితులకు తగదు.

విద్యామంత్రి:- స్థానిక పరిస్థితులను అనుసరించి, కాలాన్ని నిర్ణయించుకోవచ్చు.

శ్రీ వెంకటరెడ్డి:- అది సరే—కాని ప్రభుత్వమే ఒక నిబంధనను చేయవచ్చు. హిందీ భాషా వ్యాప్తికై ఎక్కువ ప్రయత్నాలను చేయాలి రాయలసీమ మొత్తంమీద రెండే స్త్రీ ట్రైనింగ్ కాలేజీలున్నాయి. ఇంకా యెక్కువ చేయటం అవసరం. మద్రాసులో తెలుగు భాషపై దెబ్బతీస్తున్నారు. మద్రాసు ఆంధ్రులకు, తమిళులకు ముఖ్యమైనదే కావటం, మద్రాసులో తెలుగుపై దాడిచేయకుండా ఉండటంమంచిది. ఆంధ్రా యూనివర్సిటీకి ఇచ్చే గ్రాంట్ చాలా తక్కువగా ఉంది. అన్నామలై యూనివర్సిటీకి దాదాపు 10 లక్షలు ఇస్తున్నారు. కాని ఆంధ్రా యూనివర్సిటీకి 4½ లక్షలే ఇస్తున్నారు. ఈ విభేదాన్ని పోగొట్టాలని వెంకటరెడ్డిగారు విజ్ఞప్తి చేశారు.

అంతట సభవారు ఫలహారానికి లేచారు.

### ఫలహారానంతరం

చిన్నకౌజియార్‌గారు ఫలహారానంతరం ఉపన్యాసం సాగించిరి. ఉరుదూ మాతృభాషగల పిల్లలు యే పాఠశాలలో నైనా అధికసంఖ్యాకులుగా నున్నట్టయితే అట్టి పాఠశాలలలో ఉరుదూలోనే విద్యాబోధ జరగాలి. ఉరుదూ తెలిసేవారు విశేషంగా ఉన్న చోట్లలో తమిళమున బోధిస్తే ఏమి ప్రయోజనం? అన్ని మహ్మదీయ పాఠశాలలూ ఉరుదూలో బోధించాలని మేము కోరడం లేదు. ఉరుదూ నేర్చుకొనేవారు అధికసంఖ్యాకులుగా నుంటేనే ఉరుదూలో విద్యాబోధ నొసగే ఏర్పాటు చేయాలన్నారు. మహ్మదీయ పాఠశాలల్లో అన్ని మతాలవారిని చేర్చుకోడం జరుగుచున్నది గాని పచ్చయ్యప్ప కాలేజీలో మాత్రం ముస్లిములను చేర్చుకోరన్నారు. ఆ కాలేజీకి ప్రభుత్వం గ్రాంటు యిస్తున్నా. అలా ఉన్నప్పుడు ముస్లిములకు ప్రత్యేక విద్యాసంస్థ లెందుకు నిర్వహించరాదన్నారు.

ఈశ్వరన్‌గారు డిమాండును బలపరిచారు.

మజిద్‌గారు కోత ప్రతిపాదనను బలపరుస్తూ బడ్జెటులో యీశాఖకు ప్రత్యేకింపబడిన మొత్తం జరగవలసిన కార్యాలకు యేమాత్రం చాలదనియు రాష్ట్రంలో మారుమూలలకుకూడా విద్యావ్యాప్తి కావాలంటే యీ గ్రాంటు యింకా చాలా ఎక్కువగానే ఉండాలన్నారు జిల్లా విద్యాసలహా సంఘాలు యిదివరకు విద్యా విషయములలో మంచి సలహాలిస్తూ రాష్ట్రంలో విద్యాభివృద్ధి కార్యములను చూసుకొనుచుండినవి. ఈ సంఘాలను ప్రభుత్వంవారు పునరుద్ధరించవలెనని వయోజన విద్యావ్యాప్తిచే దురవట్లు చేయవలెనన్నారు.

శ్రీ త్యాగరాయపిళ్లెగారు తమిళంలో మాట్లాడుతూ జాతీయ ఆదర్శాలకు తగినట్లు విద్యావిధానమును సంస్కరించి అమలు జరుపవలెనన్నారు.

బీదపిల్లలు ఏదో కొంత కూలీ లభిస్తుందని పనులకు వెళ్ళుచున్నారని అట్టి వారు పాఠశాలలకువెళ్లి చదువుటకు అవకాశం లేదు. కొన్ని వారు యిండ్లలోనే చదివి పరీక్షలకు హాజరు కావటానికి అవకాశమివ్వాలని కోరారు.

మొహిద్దీన్ భట్టిగారు కోత తీర్మానమును బలపరుస్తూ ముస్లిముల విద్యాసౌకర్యాల విషయమై ప్రభుత్వ అవలంబిస్తున్న వైఖరిని విమర్శించారు.

అబ్దుల్ హమీద్‌ఖాన్‌గారు భావిరాజ్యాంగము వయోజన ఓటర్లమీద ఆధారపడి యుండుట గనుక అట్టి వారందరూ అంతవరకు విద్యావంతులుగా నుండేటట్లయితే వారు తమ బాధ్యతలను బాగా నెరిగి ఎన్నికలలో ఓటు చేయుటకు అవకాశముండునని. ముస్లిం విద్య యెడలను, ముస్లిం విద్యాధికారుల యెడలను విద్యామంత్రికి అయిష్టమున్నదనియు దానివల్ల ముస్లిములకు విద్యాసౌకర్యాలిచ్చే విషయంలోను ముస్లిం విద్యాధికారులకు ఉన్నతోద్యోగాలిచ్చే విషయమునను విద్యామంత్రి ప్రతికూలుడుగా నుండడము చాలా విచారింపదగినదనియు అన్నదిరి.

విద్యామంత్రిగారు గౌరవసభ్యుడు చెప్పే వ్యక్తికి ప్రాంతీయ భాషలో సరి చదువు లేకపోవడమే ఆయనను జిల్లా విద్యాధికారిగా నియమించక పోవుటకు కారణమని చెప్పారు.

ముస్లిములకు ప్రోత్సహించ రాదనే పట్టుదలవల్లనే యీ విధంగా మంత్రిగారు చేసున్నారని ఘటాపథముగా చెప్పగలనని హమీద్‌ఖాన్‌గారు అన్నారు

శ్రీ డి వి. రామస్వామిగారు ఆంధ్ర విశ్వవిద్యాలయమునకు చెందిన కాలేజీని బాగా అభివృద్ధి పరచుటకు ప్రభుత్వంవారు తగు చర్యలు తీసుకోవాలన్నారు.

ఫిర్నాండెజ్, పొన్నుస్వామి గౌండర్ లక్ష్మి అమ్మాళ్ గార్లు కూడా విద్యావిధాన సంస్కరణావశ్యకత గూర్చి మాట్లాడారు.

శ్రీ ఎన్ నా ప్పగారు రాయలసీమలో ఎక్కువ కాలేజీలు స్థాపించి అక్కడివారికి విద్యావసతులు కల్పించవలెననియు హరిజనులకు తగురీతిని విద్యాసౌకర్యాలు హాస్టళ్లలో వసతులు కలుగజేయవలెనని కోరిరి.

జనాబ్ అన్వర్ మాట్లాడుతూ రూ 40 జీతంతో బడిపంతులు సంతృప్తికరమైన జీవితాన్ని గడుపుతున్నట్లుగాని, ఉత్కృష్టమైన అనుసరిస్తున్నట్లుగాని అనుకోటానికి వీల్లేదన్నారు. నిర్బంధ విద్యావిధానానికి ఇంకవరకు సక్రమ ఉపక్రమణిక జరుగలేదు. వైద్యశాఖ, విద్యాశాఖ ఈ రెండూ చాలా ఉత్కృష్టమైన శాఖలు, ఈ శాఖల్లో చాలా మర్యాదతో జీవించగల మనుష్యులు కావాలి-వారు అలా జీవింపగలిగే ఏర్పాట్లు జరగాలని అన్వర్‌గారన్నారు.

శ్రీమతి అమ్మన్నరాజా, పసిపిల్లల జీతాలు వారికిండికిసరిపోవటంలేదన్నారు ఈబీద ఉపాధ్యాయులను తరచుగా బదిలీ చేయటం అన్యాయం. పిల్లలు ఎక్కువగా సూళ్లకు రారనే నెపంతో నిర్బంధ ప్రాథమిక విద్యను ప్రారంభించలేకపోవటం న్యాయం కాదు. చిన్నపిల్లలను సముదాయించటానికి స్త్రీలు ఇళ్ళల్లో పెద్దపిల్లలు కావాల్సివస్తున్నారు. శిశు సంరక్షణాలయాలను స్థాపించి, ప్రాథమిక విద్యావ్యాప్తిని ప్రోత్సహించాలి.

మతం, కులం పేరులో సంఘాలు ఉండరాదు ముస్లింసభ్యులు, వారికి పరాయి ప్రభుత్వంలోనే మంచి సదుపాయాలు లభించాయని, ఈ ప్రభుత్వంక్రింద ఏమీ దొరకటంలేదని అంటున్నారు. పరాయి ప్రభుత్వానికి ఒక సంఘంవారిని విడదీయటం అవసరమైనది. ప్రస్తుతం అట్టి అవసరంలేదు. చివరకు హరిజనులకుకూడా ప్రత్యేకసంస్థలు అక్కరలేదు. వారికి అన్ని సదుపాయాలూ కలిగి స్థైర్యం, ముస్లిములకే కులతత్వం ఉండటం మహాపరాధం. వారు ఈ తత్వాలను అంతమొందించాలి. ఆంధ్ర యూనివర్సిటీ విషయాన్ని, గోపాలరెడ్డిగారు న్యాయంగా చూడాలని అమ్మన్నరాజాగారన్నారు.

డి. రామచంద్రరావుగారు ప్రసంగిస్తూ మన అదృష్టవశాత్తు, బళ్లోకి వెళ్ళాల్సిన వయస్సులో, మనదేశంలో అనేకులు పిల్లలు పనిచేసుకు జీవించాల్సి వస్తోందన్నారు. ప్రభుత్వం విద్యావ్యాప్తికై ఇతోధికంగా ఏర్పాట్లు చేయాలని రామచంద్రరావుగారన్నారు.

శ్రీ అవినాశిలింగం చెట్టియారు సమాధానం చెప్తూ, ఇట్లు విమర్శకాలాలవని లీగ్ సభ్యులకు సలహా ఇచ్చారు. ముస్లింలకు నలుగురితో కలిసి మెలిసి బతికే చదువు కావాలి. దానికోసమే ప్రయత్నాలు జరుగుతున్నాయి. ముస్లింస్త్రీల కాలేజిలో, అత్యధిక సంఖ్యాకులు హిందువులు. దాన్ని ముస్లిం కాలేజి అంటానికి వీల్లేదు. పైగా దీన్ని ఒక వ్యక్తికి నడిపింప దల్చుకున్నప్పటికి ముస్లింస్త్రీల కేర్పడు నష్టం లేదు.

జనాబ్ సలాం:- లేడీహోప్ కాలేజిని ఎందుకని తీసికొన్నారు?

మంత్రి:- ఆంధ్రలో ఒక ప్రభుత్వకళాశాల ఉండాలని నిశ్చయించాం. పైగా గుంటూరు ముస్లిం ట్రైనింగ్ స్కూల్‌లో దాదాపు 27 మంది విద్యార్థులున్నారు. 27 మందితో కాలేజి నడపటం కష్టసాధ్యం. ఇక స్కూల్ భవనాల మసలించి, కొద్దిలో భవనాలు తయారు కావటానికి తగిన ప్లానులు తయారైనవి. ఇరవై రెండు నెలల్లో భవనాలు తయారవటానికి అవకాశాలున్నవి. పచ్చయ్యప్ప కాలేజీలో విద్యార్థులను చేర్చుకోటంలో పక్షపాతత్వాలు చూపబడుతున్నాయని అన్నారు. వారిని ఈవిషయమై వారించనున్నాము. బడ్జెట్ లో చూపిన ధనమేకాక, ఆంధ్ర యూనివర్సిటీ కార్యాలయాలకు గ్రాంటు ఇస్తున్నాము. హాస్టల్సుకూడా ఈసంవత్సరమే కొంతధనాన్ని ఇవ్వదల్చుకున్నాము. వారి హాస్టల్ ప్లానును పరిశీలిస్తున్నాము. మద్యనిషేధం మూలానవచ్చేడబు ఆదాయం తగ్గిపోయినప్పటికీ, మనం విద్య ఆరోగ్యశాఖలపై చాలాధనాన్ని ఖర్చుపెట్టగలుగుతున్నాము. నిర్బంధ విద్యా కార్యక్రమంలో నే చేసినదని నాకే సంతృప్తికరంగాలేదు. పెద్దమనుష్యులు ప్రభుత్వానికి ఈ కార్యక్రమంలో సహాయం చెయ్యాలి. శాసనసభ్యులు, వయోజన విద్యాప్రచారోద్యమానికి పూనుకోవాలని విన్నవిస్తున్నాము. ఎవరి నియోజకవర్గంలో వారు ఈపని చెయ్యటం అవసరం. వచ్చే సంవత్సరంలో సెకండరీ విద్యను ఎక్కువగా ప్రవేశపెట్ట దల్చుకున్నాము ఉపాధ్యాయుల జీతాలను అధికం చెయ్యాలనే నా వాంఛ. అది త్వరలోనే జరుగుతుంది. హరిజనులకు విద్యా ప్రోత్సాహమివ్వటానికి, వారిపై జరగాల్సిన ఖర్చు కోసం గత సంవత్సరం కన్న నాలుగు రెట్లు పెంచాము. ప్రస్తుతం ప్రాథమిక, సెకండరీ విద్యా సంస్థల్ని ప్రభుత్వం నడిపేశక్తికలిగి ఉండలేదని అవనాశిలింగంగారన్నారు.

బీకం అమీరుద్దీన్, ముస్లిం విద్యా విషయమై పునరాలోచన చేస్తామని హామీ ఇస్తేగాని, తాము కోత తీర్మానాన్ని ఉపసంహరించదల్చుకోలేదన్నారు.

విద్యామంత్రి అట్లాంటి హామీని ఇవ్వనిష్టపడలేదు. తీర్మానాన్ని ఓటుకు పెట్టారు, అనుకూలంగా 30 మంది, ప్రతికూలంగా 61 మంది ఓటు చేశారు. కోత తీర్మానం వీగిపోయింది.

అసెంబ్లీ మర్నాటికి వాయిదా పడింది.

జెరుసలేమ్, మార్చి 11: యూదు ఏజెన్సీ, కార్యాలయం ఆవరణలో ఇవాళ ఒక బ్రహ్మాండమైన ప్రేలుడుసంభవించింది. ఈ ప్రేలుడుకు పైలు దూరంలో ఉన్న ఇళ్లు కూడా అదిరిపోయింది. కార్యాలయం కట్టడంలో అధికభాగం కూలిపోయింది. ప్రాణహాని విపరీతంగా జరిగి ఉంటుందని అనుకుంటున్నారు.

## మదరాసు ధరలు

మదరాసు, మార్చి 12:

వేరుసెనగ (581 పా 1-8 ఎక్సు కోస్తా గిడ్డంగులు) కంపెనీ (సేల్సుటాక్సు తో సహా) బజారు రు. 132-8-0
ఆఫీసువద్ద రు.
వేరుసెనగనూనె: ఎక్సుమిల్లర్ (టాల్ కోల్) (సేల్సుటాక్సుతోసహా) రు. 289-0-0 (గ్యారంటీ)
ఆముదం బజారుదెలివరి ఎక్సుమిల్లర్ కర్ ఇంగ్లీషు కాండి 500 పౌనులు గలది రు. 350-0-0
కొంకణామునూనె (39 పౌను గల డబ్బా) రు. 18-12-0 19-8-0

బంగారు-వెండి నేటి మధ్యాహ్నం
1 గంటకు సవరను 1-8 ఎద్దుర బొమ్మ సేల్సుటాక్సుతో సహా వెల 71-8-0 పెట్టా బంగారు తులం 111-8-0 మాసబంగారు 109-4-0, సీమవెండి తులం 100-8 (రతి) 164-0-0 తులం వెండి 1-8 1-12-0.

### పంచదార

2 అందరు "కామ్పూరు" రు. 104, 105
2 అందరు "ప్యారీ" రు. 103-8-0
2 అందరు "పుయ్యూరు" రూ. 108-8-0

## నూలుధరలు

మధుర మిల్లులు
20 నెం కౌ॥ (10 పౌనులు) రు13-5-0
40 నెం కౌ॥ (5 పౌనులు) రు 12-11-0,
60 నెం కౌ॥ మొదలురకం (5 పౌనులు) రు 28-4-0, 60 నెం కౌ॥ రెండవరకం (5 పౌనులు) రు 18-11-6, 80 నెం కౌ॥ (5 పౌనులు) రు 29-4-0, 80 నెం కౌ॥ (కోముడు) (5 పౌనులు) రు

కోయంబత్తూరు, ఇతరమిల్లులు
1½" నెం కౌ॥ (10 పౌ॥లు) రు
2" నెం కౌ॥ (10 పౌ॥లు) రు 6-6-0
4" నెం కౌ॥ (10 పౌ॥లు) రు 6-9-0
6½" నెం కౌ॥ (10 పౌనులు) రు 6-13-0
40" నెం కౌ॥ (10 పౌ॥లు) రు 21-3-0
60" నెం కౌ॥ (5 పౌ॥లు) రు 18-11-6
80" నెం కౌ॥ (5 పౌ॥లు) రు 29-4-0
30" నెం కౌ॥ (10 పౌ॥లు) రు 17-12-6
32" నెం కౌ॥ (10 పౌ॥లు) రు 18-6-0

దిగుమతియైన నూలు
150 'డి' ఇటలీ సీనియా పౌను 1 కి రు 8-12-0, 120 'డి' ఇటలీ సీనియా పౌను 1 కి 9-4-0, 150 (డి) ఇటలీసినియా పౌను 1 కి 100 ప్రకాశమైన పౌను 1 కి 9-8-0 2/150 రెండు మడతలు పౌను 1 కి రు 11-12-0.

## న్యూయార్కు దూది

న్యూయార్కు, మార్చి 11:
మార్చి 33 51/33 50
మే 33.65/33.68 జూలై 32.90/32 90
అక్టోబరు 29 92/29 92 డిసెంబరు 29.35/29.35 మార్చి 29.14/29 14 మే 28 84/ నా. జూలై 28.11 నా.
మిడ్లింగ్ బోజరు 34 88
మే (గరిష్ఠధర) 33.90
(కనిష్ఠధర) 33 48

మే వాయిదా ధరలు

| | | |
|---|---|---|
| నేటి ప్రారంభం | వెల | 33.67 |
| నిన్న | | 33.70 |
| ,, ముగింపు | వెల | 33.65 |
| నిన్న | | 33.64 |











Edited, Printed & Published by S. Sambu Prasad at the Andhra Patrika Press, No. 7. Thambu Chetty St., G. T. Madras.